# గురుశిష్య సంవాదము.

गुरुशिष्यसंवादमु.





మద్రాసు.

ఆనందముద్రణాలయమున

ముద్రితము.

---

1922.

శ్రీ కృష్ణ.

# గురుశిష్య సంవాదము.



భగవద్దాసుడయిన యొకఁడు భగవత్పరిజ్ఞానము కొఱకు పరిజ్ఞాతలయిన పెద్దలయొద్దకు బోవుచు నొక తావుననిర్మలచిత్తముతో భగవదారాధనముం జేయుచున్న యొక మహనీయునిసన్నిధి జేరి, యాతని సందర్శనము ంజేసికొని సాష్టాంగదండప్రణామంబు లాచరించి యాతని సన్నిధిని గనిపెట్టియుండి, క్రమముగ బరిచర్య సేయుచు నాతనియనుగ్రహమును గోరుచుండెను. ఆయన కొన్ని దినములవరకు నీతని ప్రవృత్తిని గనిపెట్టి భక్తిశ్రద్ధలకు సంతోషించి యొకనాఁడు ఓవిష్ణుభక్తుఁడా? నీవిచటికేలవచ్చితివి, సర్వసంగపరిత్యాగులమయి భగవదారాధనముం జేయుచున్న మావలన నీకు బ్రయోజనమేమి. యని యడిగెను.

దాసుడు 'స్వామీ భగవత్పరిజ్ఞానము కొఱకు, ననేకులగు పెద్దలను సేవించి వారిదయను సంపాదిం

చితిని. కాని వారానతిచ్చు శాస్త్రిప ద్ధులను దెలిసి కొనజాలక నావంటి మూఢునకు సులభముగ బోధ పరచు మహాత్ములెచ్చట నుందురోయని తిరిగితిరిగి నాపుణ్యవశంబుననిచ్చట తమదర్శనముం జేసితిని ఇక మీయనుగ్రహము నాభాగ్యము, అని యవనతశిర స్కుడై యూరకుండెను. పిమ్మట నామహాత్ము డీతని యుక్తప్రవర్తనమువలనను, భక్తివలనను, నిండుగ దయగలిగి ఓప్రియశిష్యుడా నీవు దేనిని దెలిసికొన గోరియుంటివో దానినడుగు,మని యానతిచ్చెను పిమ్మట శిష్యుడడుగుచున్నాడు.

ప్రశ్నము. మహాత్మా? భగవంతుడన నెవ్వడు. ఎచ్చటనుగానరాడే! ఆయన యెవ్వరికి బొందశక్యమయినవాడు?

ఉత్తరము. మనోనిగ్రహముగలవారికి మాత్రమే ఆయనప్రాప్యుడు. మనస్సు స్వాధీనము కాగానే జ్ఞానేంద్రియ కర్మేంద్రియములన్నియు స్వాధీనముల గును. త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు జ్ఞానేంద్రియములు. వాక్ పాణి పాదపాయూ పస్థములు

కర్మేంద్రియములు, వీనిని గెలుచుటకు మనో నిగ్రహము ప్రధానము. అట్టివారికిగాని యాభగవంతుడు గోచరుడుగాడు. అందువలన నాతనికి కేశవనామము వచ్చినది. కేశవశబ్దమునకు-

క-ఈశ-వ-అనివిభాగము. దీనికర్థము.

క. మనస్సునకు ఈశ-ప్రభువులు, అనగా మనోనిగ్రహముగలవారు. అట్టివారికి, వ-ప్రాప్యుడు-

ప్ర॥ ఇతరులకు జెల్లరాని నారాయణశబ్దము కంటె మనోనిగ్రహముగలవారికి ప్రాప్యుడను నర్థమిచ్చు నీ కేశవనామము ముందుగ నేల తీసికొనబడినదో యానతీయగోరుచున్నాడను.

ఉ॥ దేవతలుఋషులు మొదలగువారికి మనోనిగ్రహము ప్రధానముయి యున్నది. అట్టివారుకొన్ని కొన్ని సమయములయందు మనోనిగ్రహమును తప్పియు శపించియు నున్నారు. ఈ కేశవుడవతారములయందుగూడ మనోనిగ్రహమును దప్పియు శపించియు నుండలేదు. అందుచేమనోనిగ్రహముగలవారికి

వారిప్పుడను నర్థమిచ్చు నీకేశవనామమే ముందుగ దీసికొనబడినది.

ప్ర॥ గురువర్యా! భారతయుద్ధములో నర్జునునకు సారథ్యముచేయుచు నొకనాడు మునికోలను నింకొకనాడు చక్రమునుబట్టుకొని శ్రీస్వామివారు భీష్మునిజంపుటకై యాతనిమీదికి బోయియుండిరని వింటిని. కోపమునుబట్టలేకయే కదా అట్లుచేసినారు.

ఉ॥ భారతగ్రంథకర్త కౌరవపక్షపాతియనిమహాభారతరామాయణవిమర్శమున విపులముగ జర్చింపబడియున్నది. ప్రతిపక్షమువారగు పాండవులపక్షమున నున్న యీశ్రీకృష్ణులవారిని యీగ్రంథకర్త తూలనాడకయుండునా! యుద్ధముచేయనని ప్రతిజ్ఞ చేసి సర్వేశ్వరుడైనవాడుభీష్మునిమీదికెట్లుపోవునా! ఇది ధర్మరాజబద్ధమాడెనని చెప్పబడిన కథకంటె నసంబద్ధమైయున్నదని గ్రహింపుము.

ప్ర॥ భారతగ్రంథములో మరియొకచోట శ్రీకృష్ణులవారశ్వత్థామను శపించినట్లున్నదనియువింటిని!

ఉ॥ ఉపపాండవులను గొంతులుగోసిచంపినందుకు
గాను ద్రౌపదికి దుఃఖోపశాంతిచేయుటకై ధర్మజ
భీమార్జునులశ్వత్థామ మీాదికి బోయి యాతనిశిరో
మణిని దెచ్చియామెకిచ్చి దుఃఖోపశాంతిచేయగా శ్రీ
స్వామివారేసందర్భములో నెందుకుగానుశపియించి
యున్నారోనీవుబాగుగ దెలిసికొనుము. బ్రహ్మశిరో
నామకాస్త్రము నశ్వత్థామ పాండవులమీాద
బ్రయోగించినట్లును దానికి బ్రతిగ నర్జునుడాయస్త్ర
మునే ప్రయోగించినట్లును కథకల్పింపబడియున్నది.
ఏయస్త్రముగాని ప్రతివీరునో యుద్ధరంగమునందున్న
వారినో బాధింపవలెను నారాయణాస్త్రమనునది
యుద్ధరంగమందున్న రథికులనుగూడ రథములను
డిగి. యాయుధములను నేలవిడువగా బాధించియుండ
లేదు. అట్లనే యీయస్త్రము ప్రతివీరులను బా
ధింపవలెను. గాని యపాండవముచేయుమని యశ్వ
త్థామకోరగా పాండవస్త్రీల గర్భములందున్న పిండ
ములను బాధించుట యస్త్రముచేయు పనికాదు.
ఆవేళ శాపమునందట్టిశక్తియుండిన నుండవచ్చును.

అట్లు శపించుట కమానుష ఘోరకృత్యమును జేసిన యీయశ్వత్థామ కట్టి సామర్థ్యమెట్లు కలిగి యుండును? ఇంతియ కాక యశ్వత్థామ వ్యాసుల వారినిగూడ శపించినట్లున్నది. ఇదియు నసందర్భమే, కొందరు మహావీరులు యుద్ధరంగములో తమ ముఖ్యశత్రువులను జంపునవసరములయందు గొన్ని శపథములను జేసి యున్నట్లు పురాణములలో నచ్చటచ్చట గలదు. అట్లు శపథము చేయుటకు సామర్థ్యమయిన నీయశ్వత్థామ కెట్లు కలిగి యుండును? ఈగాథయంతయు కౌరవపక్షపాతియగు గ్రంథకర్త చేత నిట్టి ఘోరపాపియగునశ్వత్థామ యాధిక్యము కొఱకు గల్పింపబడినది అట్టి యసందర్భములో నశ్వత్థామను శ్రీస్వామివారుశపించిరనుమాట విశ్వసనీయముగాదని నీకే స్పష్టపడగలదు.

ప్ర॥ నారాయణుడు గొప్పదైవమనియు సతినిని మించిన దైవము లేదనియు పెద్దలు చెప్పుచున్నారు ఆనారాయణుని విషయము నారాయణశబ్దార్థముతో విపులముగ నానతీయ గోరుచున్నాడను.

ఈ॥ ఈ నారాయణశబ్దమున కనేకార్థములు పరాత్పరుని తెలుపునవి కలవు. 1 జీవసమూహమున కాధారుడు. అనగా జీవులమగు మనకాయనే యాధారుడు, ప్రభువు 2 జీవసమూహముచే బొందదగినవాడు, అనగా మనము యుక్తప్రవర్తనము గలిగి ప్రపత్తిచేగాని భక్తిచేగాని కొలిచినయెడల ముక్తి నిచ్చుననుట. 3 జీవసమూహమును దనసన్నిధిని బొందించువాడు. అనగా తనసన్నిధిని బొందుటకు తగిన పౌరుషశక్తి నిచ్చినవాడు. దానిని క్రమముగ నభివృద్ధిలోనికి దెచ్చుకొని యతని నారాధించిన యెడల నాతనిసన్నిధిని జేరగలము అట్టిశక్తినిచ్చుట వలన జీవసమూహమును దనసన్నిధిని బొందించువాడయ్యెను. 4 జీవసమూహమున కంతర్యామి యయినవాడు. జీవులన్నిటియందు నిండియున్నవాడనుట. 5 జీవసమూహముయొక్క ప్రవర్తనను గనిపెట్టువాడు. జీవులయం దంతర్యామియై యుండుటయే గాక వారల ప్రవర్తనను సర్వదా కనిపెట్టుచుండును. జీవసమూహమునకు ప్రవర్తకుడు అనగా

ప్రభువు. శ్రుతిస్మృతిరూపమయిన తనయాజ్ఞచే జీవులకు ప్రవృత్తిని విధించినవాడు. 7 ప్రళయ కాలమున జలములయందు వసియించువాడు. అనగా ప్రళయకాలమునందు జలములయందై నను సియించి యుండగలవాడు. 8 ఇరువదినాలుగు తత్త్వముల కాధారమయినవాడు. ఆతత్త్వములు, పృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతములును శబ్దస్పర్శరూపరసగంధములను పంచవిషయములును త్వక్ చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను పంచ జ్ఞానేంద్రియములును వాక్ పాణిపాదపాయూపస్థము లను పంచకర్మేంద్రియములును మనోబుద్ధిచిత్తాహం కారములను నంతఃకరణచతుష్టయమును నను నీ యిరువదినాలుగు వీనికాధారమయినవాడు. అనగా వీని నేర్పరచినవాడు. మఱియు నీనారాయణశబ్దము విష్ణుదేవున కొక్కనికేగాని యితరదేవతలకు జెల్లద నియు చెల్లవలసి వచ్చిన యెడల ణత్వమునకు మారుగ నత్వముండవలయుననియు వ్యాకరణ సూత్ర

కారుడగు పాణిని వ్రాసియున్నాడు. అందువలన నా తనికొక్కనికే నారాయణుడని పేరు చెల్లుచున్నది.

ప్ర॥ ఆహా! తమకరుణచే నారాయణశబ్దమునకు నేనెప్పుడువిని యెఱుగని యనేకార్థములను దెలిసికొంటిని అయితే ప్రళయానంతరమునగూడ నుండువాడని చెప్పియుంటిరికదా? అట్టివాడు తిరుగసృష్టి చేయవలసి వచ్చినప్పుడేమి చేయును?

ఉ॥ ఆభగవంతుడు తనలోనున్న సృష్టికిబ్రధానమయిన ప్రకృతినిముందుగ బ్రేరణచేయును. అందునుండియే మాధవనామ మాయనకు జెల్లినది. (మాధవ; మా-మాయను-ధవ-చలింప జేసినవాడు. అనగా సృష్టికి బ్రధానమయిన ప్రకృతిని ముందుగ జలింప జేసివాడు.

ప్ర॥ ఇట్టివానిని మనమెట్లు దెలిసికొనగలము?

• ఉ॥ ఉపనిషద్వాక్యము లాపరమేశ్వరునిస్వరూపమును జెప్పుచున్నవి. కావున వానివలనమనమాభగవంతుని దెలిసికొనగలము. దీనివలననే గోవింద

నామ మాయనకు గలిగెను. (గోవింద) ఉపనిష ద్వాక్యములచే ప్రతిపాదింపబడిన వాడు అని యర్థము.

ప్ర॥ అట్టినారాయణు డెచ్చటనుండును? ఆయన స్థానమెద్ది?

ఉ॥ చరాచరములయందు వ్యాపించియుండును చరములనగా సంచరించునవి. అచరములనగానొక చోట స్థిరముగనుండునవి. ఈవిధమయిన సమస్త ప్రపంచమునందును వ్యాపించియుండుటచేవిష్ణువన బడెను.

ప్ర॥గురూత్తమా? భక్తిప్రపత్తులచే భగవంతుని గొలువుమని సెలవిచ్చియుంటిరి - అయితేమనము చేసిన కర్మలఫలమెట్లునశించును!

ఉ॥ ఇతరదేవతల నారాధింపక యతనినే యారాధించుచునుండ భక్తిప్రపత్తులు బాగుగ నభివృద్ధిపొందిన పిదప నీకాభగవంతుడు జ్ఞానమునుగలుగజేయును. అందుచే కర్మఫలమునశించునుగావున

మధుసూదననామము భగవంతునియందు ప్రవర్తించినది. మధు జీవులకర్మలను సూదనుడనగా నశింపజేయువాడని యర్థము.

ప్ర॥ జీవులకంటె భగవంతునియందున్న విశేషమేమి?

ఉ॥ జీవులందరును ప్రకృతిసంబంధములగు సత్వరజస్తమోగుణములచే బద్ధులయియుందురు. భగవంతు డాగుణములచే బద్ధుడుగాడు. ఇదియే విశేషము దీనిచేతనే త్రివిక్రముడని చెప్పుదురు. సత్వరజస్తమోగుణముల నతిక్రమించినవాడని యీనామమున కర్థము.

ప్ర॥ అయితే పరమేశ్వరుడీప్రపంచము నెట్లు సృజించెను?

ఉ॥ తనలోనుండు దానినే పయికి సృజించెను. కావున వామనుడయ్యెను.

ప్ర॥ నారాయణునకు శ్రీమహాలక్ష్మి భార్యయని చెప్పుదురుకదా? ఆమె యెచ్చట నుండును?

ఆ॥ ఆమె యాయనవక్షము నాశ్రయించి యుండును అందుచేతనే శ్రీధర నామ మాయనకుగలదు లక్ష్మిని ధరించినవాడని యీనామమున కర్థము.

ప్ర॥ భగవంతునకు భార్యకూడగలదని రే? ఆయన నింద్రియములు బాధింపవా?

ఉ॥ అట్లుకాదు-మనము ఇంద్రియములచే బద్ధులమయి యున్నాము. ఆయన వానికినియామకుండయి యున్నాడు. అనగా ప్రభువయియున్నాడు-అందుచే హృషీకేశ నామ మాయనకు గలుగు. ఇంద్రియములకు ప్రభువని యీనామమున కర్థము.

ప్ర॥ భగవంతుడు తనలోనున్న ప్రపంచమునే బయికి సృజించెనని మీరనతిచ్చియున్నారే? ఆప్రపంచ మాయనలోపల నెట్లుండెను?

ఉ॥ ఈప్రపంచమంతయు సూక్ష్మరూపముగ నాయని నాభియందుండెను అందుచే పద్మనాభ నామ మాయనకు గలిగెను అనగా కుక్షిస్థాఖిలభువనుడు జగద్రూపమయిన పద్మము నాభియందు గలవాడని యీనామమునకర్థము.

ప్ర॥ ఆయన యెట్టివారికి గోచరించును?

ఉ॥ ఇంద్రియ నిగ్రహముగలవారికే తప్ప నిత రులకు గోచరింపడు కావున దామోదరనామము ప్రవర్తించినది. ఇంద్రియనిగ్రహము గలవారికి గోచరించువాడని యీనామమున కర్థము.

ప్ర॥ శ్రీమన్నారాయణుని భక్తిచేగొలుచు వారికి గలుగుఫలమేమి?

ఉ॥ భక్తులగువారి పాపములను నశింపజేయును- ఇందువలననే సంకర్షణుడను నామ మాతనికిగలి గెను-భక్తుల దుఃఖములను నశింప జేయువాడని యీనామమున కర్థము.

ప్ర॥ వెనుక చరాచరములగు సమస్త ప్రపంచ మునందును ఆయన వ్యాపించి యున్నాడని యుప పాదించితిరే! ఏవిధముగ వ్యాపించి యున్నాడు?

ఉ॥అన్ని భూతములందును ఆకాశముతో వ్యా పించి సాక్షియైయుండును; కావుననే వాసుదేవు డను నామ మాతనికి గలిగినది. సమస్తభూతముల

యందును బ్రికాశముతో వ్యాపించి యుండువాడని యీనామమున కర్థము.

ప్ర॥ ప్రకాశము మాత్రమే కలిగి యుండునా?

ఉ॥ అది యొకటియే కాదు-స్వభావము చేతనే గొప్ప కాంతియు బలమును గలవాడు-అందువలననే ప్రద్యుమ్న నామమాతనికి గలిగినది- మిక్కిలి కాంతియు బలమును గలవాడని యీనామమున కర్థము.

ప్ర॥ అట్టి పరమేశ్వరు డీలోకమున నవతరించి నపు డేవిధముగ నుండును?

ఉ॥అవతారములయందును నాతని నడ్డుసమర్థత గలవారు లేరు-కావుననే యనిరుద్ధనామముగలదు అవతారములయందును నిరోధము లేని వాడని యీనామమున కర్థము.

ప్ర॥ ఈయనకు పురుషోత్తమ నామ మేల కలిగెను?

ఉ॥పురుషులనగా మనవంటివారు కారు-ముక్త పురుషులు-అట్టి వారికంటె నధికుడని గ్రహింపవలె

ను. అందునుండియే పురుషోత్తమనామ మాయన
కు గలిగెను.

ప్ర॥ సర్వేశ్వరుడు బలము తేజము గలిగి సర్వ
త్రవ్యాపించి సాక్షియైయుండునని యానతిచ్చియు
న్నారే? అట్టివాడు మనవలెనే యింద్రియ సాధన
ముల మూలమున సాక్షియై యుండడా?

ఉ॥ అట్లుకాదు-అతడింద్రియజన్యజ్ఞానాపేక్ష లే
నివాడు-అనగా దివ్యజ్ఞానము గలవాడు. కాబట్టియే
యధోక్షజుడను నామ మాతనికి గలిగెను. ఇంద్రి
య జన్యజ్ఞానాపేక్ష లేనివాడని యీనామమున
కర్థము.

ప్ర॥ పరమేశ్వరునకు నారసింహనామ మెట్లువచ్చి
నది.

ఉ॥ నరరూపమును దాల్చిన దేవతలలో నధికు
డనియు కర్మాయత్తముగ సుఖదుఃఖముల నిచ్చు
చుండియు జనులను దయార్ద్రదృష్టితో జూచువాడ
నియు పెద్దలు చెప్పుదురు-దయార్ద్ర దృష్టి యనగా
సుఖమనుభవించు వారినిజూచి సంతసించుటయు

దుఃఖమనుభవించువారినిజూచి కనికరించుటయు నని గ్రహించవలెను. ఇందునుండియే నారసింహ నామము ప్రవర్తించినది.

ప్ర॥ ఆయన కెప్పుడయిన నాశము గలదా?

ఉ॥ ఆయన కెన్నటికిని స్వరూపసామర్థ్యములకు నాశము లేదు కావున నచ్యుతుడయ్యెను- స్వరూప సామర్థ్యములకు నాశము లేనివాడని యీనామ మున కర్థము.

ప్ర॥ ఎందుకొరకాయనను జనులు ప్రార్థింతురు?

ఉ॥ పురుషార్థ లాభము లతని వలననే పొంద బడ వలసి యున్నవి.

పురుషార్థము లనగాధర్మార్థకామమోక్షములని నాలుగు-అందు ధర్మమనగా పాపజనకములగు ప నులను మాని యుక్త ప్రవర్తన గలిగి యుండుట అ ర్థము అనగా ధర్మవిరోధము లేకుండ ధనము నార్జించు ట- కామ మనగా ధర్మవిరుద్ధములుగానివిషయము లందు ధర్మయుక్తముగా నార్జింపబడినధనమునువి నియోగించి యనుభవించుట, మోక్షమనగా ప

యిమూడు పురుషార్థములు సమముగ సేవించుచు క్రమముగ బ్రహ్మజ్ఞానాభివృద్ధినొంది తరించుట.ఇట్టి పురుషార్థ లాభము కొరకు జనులచే ప్రార్థింపబడుట వలన జనార్దననామము గలిగినది.

ప్ర॥ ఇంద్రాదిదేవతలచే పాలింపబడు లోకములనేకము లున్నట్లుశాస్త్రములు చెప్పుచున్నవి ఈయనయు నాదేవతలతో సముడా?

ఉ॥ ఇంద్రాదిసమస్త దేవతలకంటె నుత్కృష్టుడైనవాడు-అనగా నాదేవతలందరు నీయనయాజ్ఞకు బద్ధులయియే యాయాలోకములను పాలించుచున్నారు-అందువలననే యుపేంద్ర నామము ప్రవర్తించినది-ఇంద్రాదులకంటె నుత్కృష్టుడైన వాడని యీనామమున కర్థము.

ప్ర॥ తమరు నాయందు దయతో భగవంతునిస్వరూపమును అతడు జనులచే ప్రార్థింపబడువిధమును సెలవిచ్చియున్నారు-నేనట్లు చేయ నసమర్థుడనుగదా! నాగతియేమి?

ఉ॥ నీవు చింతపడవద్దు ఆభగవంతుని నామస్మ రణచే నీపాపములు హరించును. అట్టివాడు గనుక నే హరియని నామ మాయనకు ప్రసిద్ధము- నామ స్మరణాదులచే భక్తుల పాపములను హరించువా డని యీనామమున కర్థము.

ప్ర॥ అయ్యా! భగవంతునకు శ్రీకృష్ణనామము గలదు గదా! ఈలోకమున నవతరించిన కృష్ణుడీత డేనా?

ఉ॥ అతడు నితడు నొక్కటియే! అయినను నీకే శవాది నామములు శ్రుతిస్మృతులతో పాటుగ న నాదులయి యున్నందున నవతారములలోని కృష్ణు డే యీయన యని యభిప్రాయ పడగూడదు.

ప్ర॥ అయితే యీ శ్రీకృష్ణపదమున కర్థమేమి?

ఉ॥ ఆయన నిత్యానందుడని గ్రహింపవలెను.

అని యిట్లామహానీయుడయిన గురువుచే బో ధింపబడి యావిష్ణుభక్తుడాగురువునకు సాష్టాంగ దండప్రణామంబులాచరించి యాతని యనుజ్ఞగయి

కొని యొక దివ్యక్షేత్రమును జేరి శ్రీమన్నారాయణుడు సర్వదేవతలలో నధికుడగుటచే నితర దేవతారాధనను సుతరాము మాని యాతనినే యారాధించుచు పయి చతుర్వింశతి నామములను నిత్యమును పుండ్రము ధరించు కాలమున నుచ్చరించుచునా గురువుచే నుపదేశింప బడినట్టియు తరణోపాయములలో సులభ సాధనములయినట్టియు నష్టాక్షరీమంత్ర, ద్వయమంత్ర, చరమశ్లోక, జపములనిత్యానుష్ఠానములో నుంచుకొని క్రమముగ తరించెను.

శ్రీ కృష్ణ దాసుడు.

బొబ్బిలి.

